# జాతక కథలు

# పేరాశే పనికిరాదు



జాతక కథలు

# పేరాశ పనికిరాదు




రచన : అపూర్వ బొమ్మలు : బాలి



ప్రచురణ :

గోల్డెన్ పబ్లిషర్స్

1-8-115/2, చిక్కడపల్లి, హైదరాబాద్ - 20. ఫోన్ : 663867

టైటిల్ : రమణ ఆర్ట్స్ వెల రూ. 10/-

# మనసా వాచా మంచినేచేయి

కాశీ రాజ్యాన్ని పూర్వం 'దేవదత్తుడు' అనే ఒక రాజు పరిపాలించాడు. ఆ రాజుకు ఇద్దరు భార్యలు. పెద్ద భార్యకు 'మహాశాసనుడు' 'సోమదత్తుడు' అను ఇద్దరు పుత్రులు కలిగారు. చిన్నభార్యకు 'ఆదిత్యుడు ' అనే ఒక పుత్రుడు కలిగాడు. చిన్న భార్యకు ఆదిత్యుడు పుట్టినప్పుడు రాజు పరమానంద భరితుడై నీకేం వరంకావాలో కోరుకోమనీ చిన్న భార్య నడిగాడు. "ఇప్పుడేమీ అక్కరలేదు. ఒకప్పుడు అడుగుతాను. తీర్చండి!" అన్నదామె. అందుకంగీకరించాడు రాజు దేవదత్తుడు.

రాజపుత్రులు ముగ్గురూ ఒక్కటిగానే ఒకేచోటవుంటూ విద్యాబుద్ధులు నేర్చుకున్నారు. సకల విద్యలలోనూ పరిపూర్ణ మైన జ్ఞానాన్ని ఆర్జించారు. క్షత్రియ విద్యలన్నీ కూడా నేర్చుకున్నారు. ముగ్గురూ పెద్దవారయ్యారు.



ఒక రోజున చిన్న భార్య రాజు వద్దకు వచ్చింది "మహారాజా! మీరు లోగడ చేసిన వాగ్దానం ప్రకారం నా కోర్కెను తీర్చండి!"

"ఏం కావాలో కోరుకో; మేం మాటతప్పం?" అన్నాడు

"నా పుత్రుణ్ణి యువరాజుగా ప్రకటించండి."

మహారాజు నెత్తిన పిడిగుపడినట్లయింది. ""ఏమిటిది? నన్ను పరీక్షించ దలచుకున్నావా? పెద్ద వాళ్ళిద్దరుండగానే మూడోవాడికి రాజ్యార్హత ఎలా వుంటుంది? ఈ పనిచేస్తే లోకం నన్ను గురించి కోడైకూయదూ? అపవాదుల్ని మనం ఎలా సహించగలం? నీ కోరిక మంచిది కాదు. మార్చుకో" అన్నాడు రాజు. మార్చుకోనని మంకు పట్టు పట్టింది రాణి, రాజుకి చేసేది లేక పెద్దకొడుకు లిద్దరిని పిలిచి సంగతి సందర్భాలన్నీ వివరించి చెప్పి 'ఇప్పుడు నన్నేం చేయమంటారో మీరే చెప్పండి' అని వాళ్ళనే అడిగాడు.

"పిన్ని గారికిచ్చిన వాగ్దానాన్ని నెరవేర్చటం మీ ధర్మం. అట్లాగే చేయండి". అన్నాడు మహాశాసనుడు.

"అవును అదే న్యాయం!" అన్నాడు సోమదత్తుడు. తన పుత్రుల సహృదయతకు, లోకజ్ఞానానికి ఆశ్చర్యపోయాడు. ఆనందించాడు.

"అబ్బాయిలూ! అట్లాగే చేస్తాను. కాని, చిన్నరాణి అసూయా గుణం చేత మీకేదైనా ఆపద కలిగించవచ్చును. కాబట్టి మీరు వెంటనే అజ్ఞాతవాసానికి వెళ్ళిపొండి!" అన్నాడు మహారాజు కన్నీళ్ళతో. అందుకూ అంగీకరించిన మహాశాసనుడు సోమదత్తులిద్దరూ అరణ్యాలకు బయలుదేరారు. వీళ్ళిద్దరూ నగరం దాటి వెనక్కు తిరిగి చూడగా వీళ్ళిద్దరి వెనుకనే ఆదిత్యుడు తలవంచుకుని నిలబడి వుండటం చూచి స్థబ్దులయ్యారు. ఎంత చెప్పినా వినకుండా ఆదిత్యుడు "నాకు రాజ్యం అక్కర్లేదు, అన్నలే కావాలి" అని వెంటపడ్డాడు.

సోదరులు ముగ్గురూ దేశదేశాలన్నీ తిరిగి ఒక అరణ్యం లోనికి చేరుకున్నారు. ఆ అరణ్యంలో వాళ్లు ముగ్గురూ మార్గాయాసం చేత



చాలా అలసిపోయి ఒక చెట్టు క్రింద కూర్చున్నారు. కొ సేపు గడిచాక! "తమ్ముడూ, ఆ కొండదరి కొలను వున్నట్లుగా కనిపిస్తోంది. వెళ్ళి నీవు దప్పిక తీర్చుకుని తామరాకు దొప్పలతో మాయిద్దరికీ కూడా మంచితీర్థం తెచ్చిపెట్టు." అని ఆదిత్యుడితో అన్నాడు మహాశాసనుడు. అలాగే నని లేచి వెళ్ళాడు ఆదిత్యుడు.

కొలను దగ్గరకు వెళ్ళి నీరు త్రాగబోయాడు ఆదిత్యుడు. అంతలో ఒక బలమైన కోయవాడు వచ్చి ఆదిత్యుణ్ణి బంధించి దాచి వేశాడు. ఎంతసేపటికి ఆదిత్యుడు రాకపోవటంతో సోమదత్తుణ్ణి పంపించాడు మహాశాసనుడు. సోమదత్తుణ్ణి ఆ విధంగానే చేశాడు కోయవాడు. చివరకు మహాశాసనుడే కొలను వద్దకు వచ్చాడు.

ఆ కొలను చుట్టూ తమ్ముల కొరకు వెతికాడు మహాశాసనుడు. కాని మంచినీరు త్రాగి ముందు దప్పిక తీర్చుకోదలచుకోలేదు. దాహానికంటే ముందు తమ్ములు కావాలి మహాశాసనుడికి!

అంతలోనే అక్కడ కోయ ప్రత్యక్షమయాడు! "ఏమయ్యా ! అలసిపోయినట్లున్నావు పాపం దాహం తీర్చుకోరాదూ?" అన్నాడు

ఎంతో జాలి ఉట్టిపడేలా. అతని మాటను బట్టే గ్రహించేశాడు మహాశాసనుడు తన తమ్ముళ్ళి ఇద్దరినీ వీడే ఏదో చేసి వుంటాడని.

"నా తమ్ముళ్ళను నీవే పట్టుకున్నట్టుగా తోస్తోందే!" అన్నాడు మహాశాసనుడు.

"అవును నేనే!" అన్నాడు కోయ.

"ఎందుకని?" అన్నాడు మహాశాసనుడు.

"ఈ కొలనులో నీళ్ళు త్రాగేవారు మహాజ్ఞానులై వుండాలి. నేనడిగే సందేహాలకు సమాధానాలీయాలి. అట్లా చెప్పలేని వాళ్ళు నా బందీలే. ఈ కొలను నాది!" అన్నాడు కోయ.

"సరే నేను నీ సందేహాలను తీర్చటానికి యత్నిస్తాను"

కోయవాడు జ్ఞానానికి సంబంధించిన తన సందేహాలను అడిగాడు. ఓర్పుగాను, అర్థమయేట్లుగానూ సమాధానాలిచ్చి కోయను తృప్తిపరచాడు మహాశాసనుడు. కోయవాడు ఆనందించి, "నీ ఇద్దరి తమ్ముళ్ళలోనూ ఒకతణ్ణి తిరిగి నీ కిస్తాను. ఎవరు కావాలి?" అన్నాడు.

"ఆదిత్యుణ్ణి యివ్వు!" అనేశాడు.

"అదేమిటి? ఆదిత్యుడికంఏట పెద్దవాడుండగా చిన్నవాడయిన ఆదిత్యుణ్ణే కోరుతున్నావేం? అది న్యాయమేనా?" అన్నాడు కోయ.

"న్యాయం విషయం నాకూ తెలుసు. అయ్యా! నా తల్లికి నేను మిగిలివుంటాను. నా పినతల్లికి ఒక పుత్రుడుండ వద్దా? అంతేకాదు ఈ నా చిన్నతమ్ముడు రాజ్యాన్ని కూడా త్యజించి సోదర ప్రేమతో మమ్మంటి పెట్టుకునున్నాడు. మాతో కష్టాలనుభవించాడు.' ' అన్నాడు మహాశాసనుడు.

"నిజం! నీవు మహాజ్ఞానివి మాత్రమే కాదు, మనసావాచా మంచినే చేసేవాడివి!" అని ఆనందంతో ఆ కోయ మహాశాసనుడి తమ్ముళ్ళిద్దరినీ వదిలి పెట్టేడు. ఆదిత్యుడు సేనాధిపతిగా, సోమదత్తుడు ఆర్థిక మంత్రిగా చేసుకుని మహాశాసనుడే రాజ్యాన్ని పరిపాలించాడు.

# మంచి ఎక్కడ వున్నా స్వీకరించాలి

ప్రతాపుడు అనే ఒక మహారాజు పూర్వం కాశీరాజ్యాన్నేలాడు. ఆ రాజుకు నూరుగురుకొడుకులు. కడసారి కొడుకు సంవరుడు. మహారాజు తన నూరుగురు కొడుకులను వంద మంది గురువులకు వప్పగించి విద్యాబుద్ధులు చెప్పించాడు. సంవరుడి గురువు 'విజ్ఞాని'

విజ్ఞాని మహాజ్ఞాని ఏ రహస్యాలు దాచుకోకుండా సంవరుడికి తన విజ్ఞానాన్నంతటినీ అందించాడు. సంవరుడు కూడా గురువు ఆజ్ఞ జవదాటకుండా, చెప్పినట్లు వింటూ ఆయన మాటను జవదాటకుండా నడుచుకుంటూండేవాడు.

కొన్ని సంత్సరాలు గడిచాయి. గురువులందరూ తమ శిష్యులయిన రాజపుత్రులను తీసుకొని వచ్చి మహారాజుకు వప్పచెప్పారు. రాజు వాళ్ళందరినీ పరీక్షచేసి గురువులకు సన్మానంచేసి, తగిన పారితోషికమిచ్చి పంపించారు. ఆ తరువాత మహారాజు ఒక్కొక్క కొడుక్కి ఒక్కొక్క భూభాగాన్ని యిచ్చేడు. ఐతే - వీళ్ళల్లో సంవరుడు లేడు.

సంవరుడు తన విద్యలన్నీ పూర్తయిన తరువాత యింటికి వెళుతూ "గురువుగారూ! నా తండ్రి నాకు రాజ్యం వప్పగిస్తే నేనేంచేయను?" అన్నాడు.

"అది ఆలోచించుకోవలసిన వాడివి నీవే నాయనా!" అన్నాడు విని మందహాసం చేస్తూ.

సంవరుడు యింటికి వెళ్ళాడు. కుశల ప్రశ్నలూ అవీ అయిన తరువాత "నీ ఇష్టమొచ్చిన రాజ్యం కోరుకోబాబూ!" అన్నాడు మహారాజు.

"నాన్నగారూ! నేనందరికంటే చిన్నవాడను. నేనూ రాజ్యం పంచుకుపోతే మిమ్మల్ని కనిపెట్టుకొని వుండేవారెవరు? నాకు రాజ్యం కాదు కావలసింది, మీ పద కమలములు" అన్నాడు వినయ పూర్వకంగా, సంవరుడు జ్ఞానానికి ఆశ్చర్యపోయాడు మహారాజు

ప్రతాపుడు "సరేలేబాబూ!" అన్నాడు.

సంవరుడు తండ్రిని కనిపెట్టుకొని తండ్రి వద్దనే వుంటున్నాడు. కాని ఎప్పుడూ తన గురువును మరువలేదు.

ఇట్లా వుండగా ఒకసారి సంవరుడు తండ్రిని అడిగి పాడుబడి, బీడుగా వున్న ఒక చిన్న బంజరుభూమిని తీసుకున్నాడు. రోజూ విశ్రాంతి సమయంలో తానొక్కడే కష్టపడి ఆ బంజరుభూమిని బంగారు భూమిగా మార్చాడు. అక్కడ ఒక చక్కటి ఉద్యానవనాన్ని వేసి పెంచాడు. రోజూ సాయంత్రంపూట నగరంలోని పెద్దలందరినీ ఆ ఉద్యానవనంలోనికి రప్పించి మిత్రభావంతో వాళ్ళనందరిని పరిచయం చేసుకున్నాడు.

తండ్రి ఆనుజ్ఞ తీసుకొని ప్రతి నెలరోజులకూ ఒకసారి నగరంలోని ప్రజలందరకు సంతర్పణ చేయించాడు. ఈ సంతర్పణలో అతడు ధనికులూ పేదలూ అనే భేదం చూపలేదు. ఉచ్ఛ, నీచ కులాలను విడదీయలేదు. స్త్రీ పురుష విచక్షణను చూపలేదు.

తరువాత రాజోద్యోగులకు జీత భత్యాలు పెంచి వాళ్ళందరి ఆదరణను పొందాడు. వాళ్ళంతా నమ్మకబంటులయ్యారు.

తరువాత దేశ విదేశాలనుంచీ వచ్చే రాయబారులకూ వర్తక ప్రముఖులకూ, పేద విద్యార్థులకూ చక్కటి వసతులు కల్పించాడు. స్వయంగా దగ్గరుండి వారి వారి అవసరాలను అడిగి తీరుస్తుండేవాడు.

తండ్రి దగ్గరే వుంటూ తండ్రి ఆజ్ఞను తీసుకుంటూ ఇటువంటి మంచి పనులన్నీ చేస్తూ రాజ్యంలోని పెద్దచిన్నల అందరినీ ఆదరాన్ని పొందాడు. సవరుడు ప్రతిసారి కూడా తన గురువుగారిని సలహా అడగడమూ, ఆయన 'నీయిష్టం!' అంటూండటమూ జరుగుతూనే వుంది!

ఇట్లా వుంటూండగా మహారాజుకు అవసానదశ ప్రాప్తించింది. అప్పుడు మంత్రులు మహరాజు వద్దకు వచ్చి "మహాప్రభూ! తమ తదనంతరం ఛత్రాధిపత్యం ఎవరిదీ?" అని అడిగారు. అందుకు నా నూరుగురు పుత్రులకూ నా ఛత్రాదిపత్యం పొందే హక్కు వుంది.

మీకెవరు నచ్చితే వారే అర్హులు!" అన్నాడు. మంత్రివర్గ దృష్టంతా కూడా సవరుడి మీదే లగ్నమై వున్నదని మహారాజుకు తెలుసు! తరువాత రాజు మరణించాడు.

మహారాజు మరణానంతరం మంత్రి వర్గం సమావేశమై ఆలోచించారు. కష్టసుఖాలను ప్రజల ఉద్దేశాన్ని కూడా చర్చించి మహావైభవంగా సంవరుడికి పట్టాభిషేకం చేశారు.

సంవరుడు తన గురువుగారైన 'విజ్ఞాని' ని అంతరంగిక సలహా దారునిగా నియమించుకొని రాజ్యాన్ని ప్రజారంజకంగా పరిపాలిస్తున్నాడు. ఇది యిట్లా వుండగా సంవరుడి తొంభై తొమ్మండుగురు అన్నలూ సంవరుడికి చత్రాధిపత్యం దక్కినందుకు వాళ్ళల్లో వాళ్ళు కిందామీదా పడుతున్నారు.

చివరకు తొంభైతొమ్మండుగురు అన్నలూ ఒక్కటయ్యారు. వీళ్ళంతా ఏకమై 'ఛత్రాధిపత్యం వదులుకుంటావా మాతో యుద్ధం చేసి గెల్చుకుంటావా?" అని సంవరుడి వద్దకు రాయబారం పంపించారు. అంతేకాదు, అంతా ఏకమై సైన్యాలతో వెళ్ళి కోటను ముట్టడించారు.

అప్పుడు 'విజ్ఞాని' తో సంప్రదించి సంవరుడు తన అన్నలకు ఈ విధంగా వ్రాసి పంపించాడు. "అన్నలకు అభినందనలు ! నాన్నగారి ఆస్థిని నూరు భాగాలుగా విభజించాను. నా భాగం నేను తీసుకుంటాను మీ భాగాలను మీరు తీసుకెళ్ళండి. సోదరులైన మీతో నాకు పోరెందుకు?"

ఈ వుత్తరాన్ని చదువుకున్నారు. యుద్ధానికి సర్వ సన్నద్ధులై యున్న అన్నలందరూ. అప్పుడు అందరిలో పెద్ద వాడయిన 'ఉపోసకుడు' తక్కిన వారినందరిని సమావేశపరిచాడు. ఇలా అన్నాడు. "తమ్ముళ్ళూ, సంవరుడు మనకు బద్ధశత్రువే! అందుకు సందేహం లేదు కాని సంవరుడు యుక్తియుక్తంగా తప్పించుకున్నాడు. మన కెలాంటి యుద్ధావకాశమూ ఇవ్వలేదు. ఈ పత్రం ప్రజలందరూ

మెచ్చుకునేదిలా వుంది. సోదరులమైన మనతో యుద్ధం చేయ నంటున్నాడు. ఇటువంటి వాణ్ని మనం ఏమనగలం." ఏం చేయ గలం?"

"ఇంకా మనందరికీ ఛత్రాధిపత్యం వహించే హక్కువున్నమాట నిజమే. కాని అందరమూ ఒక్కసారే ఆ సింహాసనాన్ని అధిష్ఠించ లేంగదా! కనుక న్యాయంగా మన సంవరుడికే మనతో విరోధం పెట్టుకోవాలని లేదు. నిజానికి సంవరుడు ప్రజల మన్ననలు పొందినవాడు . కనుక సంవరుడే ఏక ఛత్రాధిపతిగా చేసి మనందరం ఐక్యమౌదాం. మనలో మనం తగవులాడుకుంటే మనం శత్రువులకు చులకనవుతాం. అంతేకాదు. రాజ్యం వందచెక్కలుగా విడిపోతే చిన్నాభిన్నమై మనం బలహీనులమవుతాం. కాబట్టి సంవరుణ్ని గౌరవించటమే ఉత్తమమైన మార్గమని నేను భావిస్తున్నాను. మీరేమంటారు?"

తతిమ్మా సోదరులందరూ చర్చించుకొని ఆలోచించుకొని అందుకు తమ అభ్యంతరమేమీ లేదు. అని తెలియచేశారు. అంతేకాదు, తమ తమ సేనలతో సహా నగరంలోనికి ప్రవేశించారు, అయితే - యుద్ధానికి కాదు - సంవరుణ్ని గౌరవించేందుకు.

సంవరుడు తన సోదరులందరికీ సాదరంగా స్వాగతమిచ్చాడు. వారందరూ వారి ఉచితాసనాల నలంకరించగా సంవరుడు ఏక ఛత్రాదిపతిగా కూర్చున్నాడు.

అప్పుడు జ్యేష్ఠుడైన ఉపాసతుడులేచి యిలా అన్నాడు. "తమ్ముడూ మంచి ఎక్కడున్నా స్వీకిరంచి గౌరవించటం మన ఆచారం. అట్లాగే చేశారు. స్వర్గస్థులయిన నాన్నగారు మా అందరకూ రాజ్యాలను పంచి యిచ్చి తన సింహాసనాన్ని నీకు వదలటానికి కారణం నీలోని మంచిని ఆయన స్వీకరంచాడుగనుకనే, అది గమనించక మేము యుద్ధానికని బయలుదేరివచ్చాము. అప్పుడూ నీమంచే మమ్మల్ని మార్చింది. అయితే - ప్రజలందరితోనూ

మంచిగా వుండటం నీకెలా సాధ్యమయింది?"

అప్పుడు సంవరుడు లేచి యిలా అన్నాడు. "అన్నలూ నేను పెద్దలను పూజిస్తాను గురువులను సేవిస్తాను. ప్రజల అవసరాలను కనిపెడుతూ వారి వారి మనసులోని కోర్కెలను కూడా తీర్చగలుగుతున్నాను అంతేకాదు ముఖ్యంగా వేయికళ్ళతో చూస్తూ, అన్వేషిస్తూ నాన్నగారిలాగే, మీలాగే నేను మంచి ఎక్కడ వున్నా స్వీకరిస్తున్నాను.

# నూరుగొడ్లను తిన్న రాబందు....

ఒక కొలను వున్నది. ఆ కొలనులో అనేకమైన చేపలున్నాయి! ఆ చేపల మధ్య ఒక పీతకూడా వుంది. వేసవి కాలంలో ఆ కొలను ఎండిపోతుంది. కొలను ఎండిపోబోతుంటే "నీరు లేక మనం బ్రతికేది ఎలాగా" అని ఆందోళన చెందుతూ విచారిస్తున్నాయి చేపలు. విచిత్రం ఏమిటంటే ఆ కొలను గట్టున ఒంటికాలిమీద నిలబడి జపంచేస్తున్న కొంగ కూడా విచారిస్తోంది.

"నీవెందుకు విచారిస్తున్నావు?" అని అడిగాయి చేపలు.

'అయ్యో! మందు వేసవి. కొలను నీరు తరిగిపోతుంది. మీరు నీరులేనిదే బ్రతకలేరు. అందును గురించి మిమ్మల్ని తలచుకునే విచారిస్తున్నాను. ఎంతో కాలం నుంచీ ఒకచోట వున్నాం కదా - చూస్తూ చూస్తూ మీరు చచ్చిపోతూండగా నేను సహింపగలనా? అయ్యో..." అంటూ మరింత విలపించింది.

"మాగతీ ఏం కానున్నదో ... ఓయ్ భగవంతుడా..." అని కంటికి మింటికి ఏకధారగా రోదించినాయి చేపలు.

"మీరు అధైర్యపడకండి. విచారించకండి. మీరు నా మాట నమ్మితే బ్రతికి బయటపడతారు లేకుంటే చచ్చిపోతారు! మీరు చావకుండా రక్షించగల బాధ్యతను నేను తీసుకున్నాఉ. మీరు నమ్మితే ఒక్కమాట చెబుతాను. నమ్మితే నమ్మండి లేకుంటే ..' అంటూ కొంత కన్నీళ్ళతో ఇంకా ఏదో చెప్పబొతుండగానే చేపలు

అందుకుని "ఏమిటి ఏమిటి మేం బ్రతికే మార్గం ఏమిటి? అన్నవి ఆతురతగా.

"ఇక్కడకు దగ్గరలో ఒక మంచి చెరువున్నది. ఆ చెరువు నిండా నీళ్ళు ఇంకిపోవు. సర్వకాల సర్వావస్థలయందూ ఆ చెరువులో నీరు వుంటూ వుంటుంది. అంతేకాదు ఆ చెరువునిండా నాచు దట్టంగా వుంది. మీరు అంగీకరిస్తే నేను స్వయంగా మోసుకుపోయి ఆ చెరువులో మిమ్మల్ని వదలి వస్తాను. ఈ పని నాకు శ్రమే అయినా - ఎంతో కాలం నుంచి ఒకచోట వున్నాం కాబట్టి - మీ ప్రాణాలను కాపాడాలని ఈ శ్రమను భరించటానికి ఇష్టపడ్డాను" అంది కొంగ.

"కొంగ చేపలకుపకారం చేస్తానంటోందే!..." అంటూ ఆలోచనలో పడ్డాయి చేపలన్నీ. శత్రువులను కాపాడ్డం ఇదే మొదలుకాబోలు అనుకున్నవి. కొంగమాటలు నమ్మాలా వద్దా అని ఆలోచిస్తున్నాయి. వాటి ఆలోచనా ధోరణిని కనిపెట్టింది కొంగ.

"ఏదో చచ్చిపోతారని బ్రతికించుదామంటే మీరు నా మాటే నమ్మటం లేదు! సరే మీ ఇష్టం. కాని మిమ్మల్ని బ్రతికించమని నాకు పూర్వజన్మలో దేవుడు ఆదేశించాడు. ఇంకా నామాట నమ్మకపోతే ఒక చేపను పంపండి ఆ చేపే చూసివస్తుంది చెరువును!" అన్నది కొంగ.

ఈ పద్ధతి మంచిదంటే మంచిదనుకున్నాయి చేపలు. ఎవర్ని మొట్టమొదట పంపించాలి అనే నిర్ణయం వచ్చినప్పుడు చేపలరేడు ముందుకు వచ్చాడు. సరే కొంగ దానిని ముక్కున కరుచుకొని, ఎగిరిపోయి! ఆ చేపరాజుకు ఒక నిండు చెరువును చూపించి తీసుకువచ్చింది. చెరువు చూచిన చేపల రాజు నిజమేనని చేపలకు చెప్పింది. చేపలన్నీ కూడా అప్పుడు కొంగ ద్వారా ఆచెరువుకు వెళ్ళడానికి సిద్ధమయినాయి. కొంగ ఒక చేపను ముక్కున కరచుకొని బయలు దేరింధి.

అయితే అది చెరువుకు తీసుకుపోలేదు. ఆ చేపనుచెరువుదారి తప్పించి ఒక చెట్టుమీదకు తీసుకుపోయింది. పాపం చేపగుండె

నీరవుతుండగా-" ఇదేమిటి కొంగా - కొలనులో దించక చెట్టుపై దించావూ?" అన్నది ప్రాణభీతితో జాలిగా భయంగా.

"అవునవును నాకిదే పని. నేను మీ సేవకుణ్ణనుకున్నారా మిమ్మల్నందర్నీ మోసుకుపోవటానికి? ఆ చెరువులోని మీ జాతిని మొత్తం తినివేస్తాను చూడు - నేను!" అంటూ ఆ చేపను గుటకాయస్వాహా చేసింది కొంగ.

కొంగ మళ్ళీ చెరువు వద్దకు వచ్చి మరో చేపను పట్టుకుపోయి తినేసింది. ఆ విధంగా అది వంద చేపలనూ తిని వేసింది! ఒక్కటీ మిగల్లేదు. మిగిలిందల్లా ఒక్క పీత మాత్రమే! 'మరి నీ మాటేమిటి పీతా?' అని అడిగింది కొంగ.

పీత మొదటినుంచీ కొంగను అనుమానిస్తూనే వుంది. ఆలోచిస్తూనే వుంది. కాని ఈ చెరువులో నీరు రోజు రోజుకూ ఆవిరయి పోతుంది. వేరు గ్యంతరం లేదు : నీళ్ళు వున్న మరో చెరువులోనికి పోవలసిందే. కానీ - కొంగ తీసుకువెళతానంటోంది. చూస్తూ చూస్తూ చావవలసి వస్తుందేమో నని అది భయపడింది.

"కొంగా నీవు మా అందరికి ప్రాణప్రదానం చేస్తున్నందుకు అందరితరుపునా నా ప్రణతులందుకో కాని చేపలిన మోసుకు వెళ్ళినట్లుగా ముక్కున కరచుకొని నన్ను మోసుకెళ్ళలేవు కనుక నేను నీ మెడను పట్టుకుంటాను నా డెక్కల్తో" అన్నది పీత.

కొంగ మొదట్లో కొంచెం అనుమానించినా, "ఆఁ గాలిలో ఈ పీత నన్నేం చేయగలుగుతుందీ!" అనుకొని అందుకంగీకరించింది.

పీత కొంగ మెడను గట్టిగా పట్టుకున్నది తన డెక్కలతో. కొంగ గాలిలో ఎగిరిపోతూ - పోతూ- పోతూ- చెరువు దారి తప్పించి చెట్టుదారి పట్టింది చేపల నీచువాసన తగిలింది పీతకు, అనుమానం అధికమయింది. క్రిందకు చూచింది. చేపముళ్ళున్నాయి! తన అనుమానం నిజమే! కొంగ భరతం పట్టాలనుకొన్నది.

"ఇదేమిటి కొంగా - ఇటు తీసుకొచ్చావేం?" అన్నది పీత.

"ఏముందీ- మీవాళ్ళందర్నీ పంపించినచోటుకే నిన్ను పంపించ

బోతున్నాను - నా కడుపులోనికి!" అన్నది కొంగ.

"నన్ను క్రిందకు దించినప్పుడు కదా నీవు నన్ను తినేది. ఈ లోగానే నువ్వు చస్తున్నావే!" అంటూ తన పదునైన డెక్కలతో కొంగ మెడను గట్టిగా కొరికేసింది పీత.

పీత యెత్తును కనిపెట్టింది కొంగ "అయ్యో...అయ్యో. నాపీక నొక్కకు నిన్ను మాత్రం తప్పకుండా చెరువులో ..."

కొంగ మాట పూర్తికాక ముందే తన పదునైన డెక్కలతో కొంగ మెడను కత్తిరించి పారేసింది పీత. కొంగ మెడా శరీరము వేరయినాయి.

" ఓయ్ కొంగా ! నూరు గొడ్డను తిన్న రాబందు ఒక్క గాలిదెబ్బకు కూలినట్లు; నూరు చేపల్ని తిన్న నీవు నా చేతుల్లో చచ్చావేమే?"

# తలను తన్నేవాడొకడుంటే....

నదీ తీరానవున్న ఒక అడవిలో కోతి వుంది. నది మధ్యలో ఓ పెద్ద దిబ్బవున్నది. ఆ దిబ్బపైన ఒక మామిడి చెట్టుపూచి వుంది. ఆ మామిడిచెట్టు కాచి, పళ్ళు పండుతూండడం కోతి చూస్తూనే వుంది! ఆ పళ్ళను తినాలని కోతికి మహా నోరూరుతూండేది. అయితే నదిని దూకి ఆ దిబ్బపైకి వెళ్ళలేక ఆగిపోతూండేది కోతి. మధ్యలో ఓ రాయివున్నది. ఆ రాతిమీదకి దూకినా ఆ రాతి మీది నుంచి దిబ్బ మీదికి పోవటానికి మరో రాయి వుంటే బాగుండేది - సునాయసంగా ఆవలకు వెళ్ళి పోగలిగే దాన్నే ! అని అనుకొంటూండేది కోతి.

ఆ నదిలో మొసలి దంపతులున్నాయి. ఒకసారి ఆడ మొసలి కోతిని చూసింది. దానిని చూచినప్పట్నుంచీ దాని గుండెకాయ తినాలనుకుంటోంది మొసలి. ఆ విషయం తన భర్త తో చెప్పి, ఆ కోతి గుండెకాయను తెచ్చిపెట్టమన్నది.

"ఓష్ అదెంతపని!" అని మగ మొసలివచ్చి రాతిమీద పడుకొన్నది. మామూలుగా కోతి రాయి అనుకొని తన మీదకు

దూకుతుందని అప్పుడు గబుక్కున నీటిలోనికి తోసి దాన్ని పట్టివేయవచ్చునని మొసలి వూహ!

కోతి రాతిమీదకు దూకబోయి, రాతిని చూచి ఠక్కున ఆగింది. "ఇవ్వాళ్ళ పెద్దదిగా కనిపిస్తోంది! నీరు తగ్గిందా అంటే - తగ్గలేదు ఏమిటిదీ ' అని ఆలోచించింది కోతి. నీటిలోని జంతువేదైనా తనను పట్టుకోవటానికి ఎత్తు వేశాయేమోనని అనుమానించింది. ఆలోచించి వెంటనే ఒక యుక్తి పన్నింది కోతి.

"ఓ రాయీ!' అని కేకవేసింది. అలా ముమ్మారు వేసింది.

"రాయి రోజూ కోతి పిలిస్తే పలుకుతుండేది కాబోలు ఇవ్వాళ్ళ నేను పైన వుండడంచేత రాయి పలకటం లేనట్లుంది కానివ్! రాయికి బదులు నేనే పనిక్కైనా తెలివితేటల్ని చూపిస్తాను!" అనుకొని ఓయ్! అన్నది మొసలి.

కోతి తన అనుమానం నిజమైనందుకు సంతోషించింది. నీవెవరవు? అని అడిగింది కోతి.

'ఇది నన్ను తప్పించుకొని ఎక్కడికి పోతుందిలే' అనే ధైర్యంతో మొసలి 'నేనేను కోతిబావా - మొసలిని! మీ చెల్లికి నీ గుండెకాయ తినాలనుందట ఏదీ యివ్వు!" అన్నది ధైర్యంగా మొసలి.

ఈ మాట వినడంతో కోతికి గుండెలో రాయిపడి నట్లయింది కాని వెంటనే ఆలోచించి ఒక్క దెబ్బతో రెండు పనులు ముగించుకోవాలని అనుకొన్నది కోతి.

"అయ్యో! ఇంతమాత్రానికే నీ వింత శ్రమపడాలా పరోపకారం కొరకేగదా నేనున్నదీనూ ఏదీ - దిబ్బవేపును నీటిలోకి దిగి నోరుజాపు సరాసరి నేను నీ నోట్లోకే దూకేస్తాను. మళ్ళీ నీకు శ్రమ ఎందుకు: సులభంగా నోటిలో కప్పిపెట్టుకొని నన్ను నా చెల్లికప్పగించుదువుగాని!' ' అన్నది కోతి మొండి ధైర్యంతో యుక్తి యుక్తంగా.

నిజమే కాబోలుననుకొని మొసలి సంతోషిస్తూ నీటిలోకి దిగి దిబ్బవేపుగా నోరుపెట్టి బారుగా నోరు చాచింది. కోతి వక్కదూకుతో మొసలి తలపైన కాలువేసి ఆవలికి మరొక్క దూకుదూకి దిబ్బపైకి

చేరింది!" " ఓ వెర్రివెంగలప్ప మొసలీ ఎంతకాలంనుంచీ నా మనసులో వున్న కోర్కె నేటికి నెరవేరింది. ఈ దిబ్బ మీదకి నీ కళ్ళు కప్పి చేరుకోగలిగాను. నీవు నోరు తెరిస్తే నీ కనులు మూతబడతాయని నాకు తెలుసును. హాయిగా యిక నేను ఈ దిబ్బపైనుంటూ మామిడి పళ్ళు తింటాను నీదయవల్ల!" అనుకొంటూ వెళ్ళిపోయింది కోతి. అప్పుడు మొసలి అనుకొంది.

తలతన్నేవాడొకడుంటే తాడిని తన్నే వాడొకడుంటాడు. "సత్యము, ధర్మము, ధైర్యము, త్యాగములచేత శత్రువులను జయించవచ్చును. ఈ నాలుగూ వానరంలో వున్నాయి. ఈ నాలుగింటిలో బలమైన దైన ధైర్య గుణంతోనే నన్ను జయించిదీ వానరం!"

# మార్పు మానవ నైజం

ఒకానొక కాలంలో 'విక్రముడు' అనే ఒక మహారాజు కాశీ రాజ్యాన్ని పరిపాలించాడు. అతడు మాంచి నడి వయసులో వున్నాడు. గర్వము, పొగరుబోతుతనమూ అతనిలో మూర్తీభవించాయి. సామాన్యులన్నా, తనక్రింద వాళ్ళన్నా, ప్రజలన్నా అతనికి లెక్కలేదు. ఆడవాళ్ళను అమాంతంగా ఎత్తుకుపోతూండేవాడు కూడా! పై పెచ్చు అతనికి పాత వస్తువులన్నా పెద్ద జంతువులన్నా, ముసలి మానవులన్నా పరమసహ్యం!

విక్రముడి ఈ ప్రవర్తన ప్రజలందరికీ చాలా బాధ కలిగించింది. అతని దుండగాలకు ప్రజలు ఆవేశాగ్రులవుతున్నారు. కాని చండ శాసనుడైన విక్రముడికి జడిసి కిమ్మన్నాస్తిగా వూరుకుంటున్నారు.

వృద్ధులు దేశం వదలి పారిపోతున్నారు. వృద్ధులైన తలిదండ్రులను పోగొట్టుకొంటున్న పిన్నలూ, యువకులూ కంటికి మంటికి ఏకధారగా విలపిస్తున్నారు.

కాశీ నగర దరిదాపుల్లో ఒక రైతుబిడ్డడున్నాడు. అతడు

యుక్తిపరుడు, ధైర్యంతుడున్నూ. అతడు రాజు చేసే దుండగాలను, ఆగడాలనూ అరికట్టాలనుకున్నాడు. ఆలోచించాడు. ఒక చురికను బొడ్లో దోపుకుని, ఒక ముంతెడు కారాన్ని తీసుకొని, ముసలి ఎడ్లను ఒక పాత బండికి పూన్చి తాను కూడా ఒక వృద్ధుని వేషం వేసుకుని బయలు దేరాడా బండిపై. ఆ రైతు యువకుని పేరు చంద్రయ్య.

చంద్రయ్య కాశీనగరం లోనికి ప్రవేశంచేప్పటికి రాజు విక్రముడు ఒక ఏనుగు అంబారీపై ఎక్కి ఊరేగుతూ ముఖ్య వీధి గుండా వస్తున్నాడు. చంద్రయ్య ముసలి వేషంలో, ముసలి ఎడ్లు లాగే పాతబండిపై రాజుకు ఎదురుగా ఏనుగు దగ్గరకు వచ్చేశాడు!

ముసలి ఎడ్లను, పాత బండి మీద ఆ శతవృద్ధుణ్ని చూసి రాజు అసహ్యించుకున్నాడు. కోపోద్రిక్తుడయ్యాడు. "పోరా అవతలకు! ఏమిటింత పొగరు? నా శాసనాన్ని ధిక్కరించి నా ఎదురుగానే వస్తావంటారా వృద్ధా?" అని అరిచాడు. ప్రజలందరూ గడగడలాడి పోతున్నారు. ఈ వృద్ధుడికి ఆయువు మూడిందను కొంటున్నారందరూ నూ. రాజు నేత్రాలు రక్త రంజితాలయినాయి. రాజు ఉగ్రస్వరూపుడై మళ్ళీ చంద్రయ్య గబుక్కున ముంతలోని కారాన్ని రాజు కళ్ళల్లోకి కొట్టేశాడు. అంతలోనే ఒక్క ఉరుకులో అంబారిపై కురికి తన బొడ్లో నుంచి చురిక తీసి రాజు గుండెకు అన్చాడు. అంతా క్షణంలో జరిగిపోయింది! రాజు గడగడ వణికిపోతున్నాడిప్పుడు. అతని కంతా అయోమయమై పోయింది. కళ్ళు తెరవలేక పోతున్నాడు. కత్తిదూద్దామా అనుకున్నాడు. కాని, తన గుండెపై ఛురిక వుండటం గ్రహించి యిక లాభం లేదనుకొని రాజు ప్రాణభిక్ష పెట్టమని ఆ శతవృద్ధున్ని ప్రార్థించాడు! శరణు జొచ్చాడు! అప్పుడు వృద్ధుని వేషం తీసివేసి రైతుబిడ్డడైన ఆ యువకుడు చంద్రయ్య ఇలా అన్నాడు.

"ఓ రాజా! ఎందుకు నీ కింత పొగరిబోతుతనం? కన్నుకానని గర్వం దేనిని చూచి నిన్నావహించింది? స్త్రీలను చెరచటానికి నీకేం హక్కుందీ? ముసలివాళ్ళను చంపే అధికారం నీ కెక్కడిది? నీవు

ముసలివాడివి కాకుండా ఇలా యవ్వనత్వం లోనే ఎల్లకాలమూ వుంటావా?

"ఓ రాజా! నీ దుండగాలకు ప్రజలెంత బాధపడుతున్నారో నీకు తెలుసునా? నీ యాతన ప్రజలలో ఎంత కలవరం లేవదీస్తోందో తెలుసునా? మారిపో! మారటం మానవ నైజం ఓ రాజా! ఈ క్షణం నుంచయినా బుద్ధి తెచ్చుకొని సరిగా మానవుడిగా ప్రవర్తించి మానవత్వాన్ని నిలుపు- సగౌరవంగా బ్రతుకు, నీ ప్రవర్తన మార్చుకోకపోయావో ఇదిగో నీగుండెపైన ఛురిక. ఇది ఎప్పుడైనా ఎక్కడైనా సరే నీ గుండెను చీలుస్తుంది. జాగ్రత్త!"

తరువాత మహరాజు ప్రవర్తన మారిపోయింది.

# నీ తాహతుకు మించి ఆలోచించకు

పూర్వకాలంలో ఒకసారి దాత కరువొచ్చింది. దాత కరువంటే ఏమిటో తెలుసుగా? బావుల్లో నీరు ఇంకిపోయింది. వర్షాల్లేక చెరువులు-వాగులు నదీనదాలు ఎండిపోయాయి. పంటలు పాడయిపోయాయి. కలరా, మసూచి, విసూచి మొదలైన



అంటురోగాలు వ్యాపించాయి. పశుపక్ష్యాదులు తిండిలేక మలమల మాడి చచ్చిపోయాయి ఆ సమయంలో.

ఒక అడవిలో ఒక కోనేరుంది. ఆ కోనేరు నాచుతోను తామర తూండ్లతోనూ నిండివుంది. అన్నీ ఎండిపోయినా ఆ ఒక్క కోనేరు మాత్రం ఎండలేదు. ఎక్కడో లోతున నీళ్ళున్నాయి. ఆ నీళ్ళలో చిన్నా పెద్దా చేపలనేకమున్నాయి. ఆ కోనేటిలో ఒక నీటి కాకి నివశిస్తోంది. ఆ నీటి కాకికి ఒక కాకి మిత్రుడున్నాడు. ఆ కాకి మిత్రుడికి ఒక కాకి భార్య వుంది. ఈ రెండు కాకులు ఆ కోనేటి వద్దనే ఓ చెట్టుపైన గూడు కట్టుకొని కాపురం చేస్తున్నాయి.

దాతకరువు సందర్భంలో కాకులన్నీ మరో ప్రాంతానికి వలసపోయాయి. మన నీటి కాకి మిత్రుడైన కాకి మాత్రం తన భార్యతో సహా నీటికాకినే ఆశ్రయించుకొని వున్నాడు. నీటికాకి తాను చేపలను పట్టి, తిన్నన్ని తిని, తన మిత్రుడికి కూడా పెడుతుండేది. ఆ కాకి తాను తిని తన భార్యకు పెడుతూండేది. ఇట్లా రోజులు గడుస్తున్నాయి. కొన్ని రోజులు జరిగిన తరువాత కాకికి ఒక దుర్బుద్ధిపుట్టింది.

ఈ నీటికాకి నాకంటే ఏ మాత్రమూ గొప్పది కాదు. నాలాగే ఇదీ నలుపుగా వుంటుంది. దీని కళ్ళూ ముక్కూ కాళ్ళూ రెక్కలూ అన్నీ నాకున్నట్లుగానే వున్నాయి. ఐనప్పుడు యిది నాకంటే ఏవిషయంలో గొప్పదీ? దీని పోషణ క్రింద వూంటూ దీనిని దేబిరించటం ఎందుకు నాకూ నా అంతట నేనే కోనేటిలోని చేపల్ని పట్టుకుతెచ్చుకుంటానూ అనుకున్నది.'' అనుకుని వెంటనే కొనేట్లో మునగబోయింది. అప్పుడు దాని ప్రయత్నాన్ని వారించి నీటికాకి ఇట్లాఅంది.

"మిత్రమా ! నీళ్ళలో మునిగి చేపలు పట్టటం నీ వల్ల కాదు. చచ్చిపోతావనవసరంగా'' అని హెచ్చరించింది.

అయినా కాకి ఆ మాటలు వినకుండా నీటిలోకి గభాల్న మునిగింది. అంతే అది మళ్ళీ బయటకు రాలేకపోయింది. తామర తూండ్లు , నాచూ దానిని ముంచి వేశాయి. చచ్చూరుకుంది కాకి.

# పేరాశపనికిరాదు

పూర్వకాలంలో ఒక అసామి వున్నాడు. ఆ అసామి ముగ్గురు పిల్లలనూ, భార్యనూ వదలి పరలోక గతుడయాడు. ఆ పిల్లలను ఇరుగు పొరుగు వాళ్ళు పెంచుతున్నారు. ఆ యిల్లాలు కూలీ నాలీ చేసుకుంటూ అట్లాగే ముగ్గురు పిల్లల తోనూ బ్రతుకును ఈడ్చుకొస్తోంది.

ఆ ప్రాంతంలో ఒక బాతుంది. అది మహిమ గల బాతు. చాలా జాలిగుండె గలది. దాని ఈకలన్నీ బంగారపువే! ఆ బాతు ఒకసారి ఈ నిరుపేద కుటుంబం అనుభవిస్తున్న అష్టకష్టాలను చూచి, జాలితలచి ఎలాగైనా ఈ కుంటుంబానికి రక్షణ యివ్వాలి అనుకున్నది. అలా అనుకున్న బాతు ఆ రాత్రే ఈ పేదరాలి యింటకి వచ్చి, దొడ్లో తన బంగారు ఈకను ఒకదాన్ని విదిల్చింది.

మరునాడుదయమే ఆ యిల్లాలుకు బంగారు ఈక దొరికింది. ఆమె చాలా సంతోషించింది. వెంటనే దానిని అమ్ముకుని డబ్బు చేసుకొంది. ఈ విధంగా ఒక వారంరోజులు జరిగేప్పటికి ఈకలు ఎక్కడినించీ వస్తున్నాయో కనిపెట్టాలనుకుని, ఆ రాత్రి జాగరణచేసి, దొడ్లో ఒక మూలగా నక్కివుంది. బాతువచ్చి రోజూలాగే ఒక బంగారు ఈకను వదల్చి వెళ్ళి పోవటం చూసింది. ఆ బాతు వంటినిండా బంగారు ఈకలే వుండటం కూడా చూసింది. "ఓహో! ఇదా కథ!" అనుకున్నది.

మరునాడు ఆమె ఆలోచించి " ఈ బంగారు బాతుస్వార్థంతో రోజుకు ఒక్క ఈకను మాత్రం విదిల్చిపోతుంది.

ఎన్నిరోజులు ఎన్ని ఈకల నేరుకుంటే ఏమైనట్లూ? అలాకాదు ఈ రాత్రికి ఆ బాతు రాగానే..." అనుకుని ఆ రాత్రి కాపలా కాసింది. అంతలోనే రోజూలాగే బాతు వచ్చి తన బంగారు ఈకను విదల్చబోయింది. కాని అంతలోనే దాక్కుని వున్న ఆ ఇల్లాలు

అమాంతంగా బాతుపైని పడి దానిని పట్టుకుని; దాని ఈకలన్నింటినీ ఊడబెరికింది. ఆ బంగారు ఈకలన్నీ వెంటనే మామూలు ఈకలయిపోయాయి! లబోదిబోమంది యిల్లాలు. పేరాశకు పోతే వున్నది కూడా పోతుందది"

# దెబ్బకు దయ్యం ఝడుస్తుంది

కొన్ని వందల సంవత్సరాల క్రిందట కాశీ రాజ్యాన్ని సేవకుడు అనే ఒక రాజు పరిపాలించాడు. సేవకుడు తన భార్యను చాలా ప్రేమగా చూసుకుంటూండేవాడు.

సేవకుడు ఒక రోజున ఉద్యానవనంలో ఒంటరిగా వాహ్యాళి చేస్తున్నాడు. అప్పుడు రాజోద్యోగుల పిల్లలు కొందరు రాళ్ళతో పామును కొడుతూండడం చూశాడు. అతడు వెంటనే వాళ్ళ దగ్గరకు పరిగెత్తుకుని వచ్చి, ఆ పిల్లలను కోప్పడి పామును కొట్టనీయకుండా వాళ్ళను ఆవలకు పంపి వేశాడు. ఆ పాము వేరెవరో కాదు నాగరాజే!

నాగరాజు వెంటనే తన నాగలోకానికి వెళ్ళి కొన్ని మణుల్ని



తీసుకువచ్చి మహారాజుకు సమర్పించుకున్నాడు. "మహారాజా! నీవు నా ప్రాణాలను రక్షించావు. అందుకు కృతజ్ఞతగా నేనీ మణులను సమర్పించుకున్నాను, దయ చేసి స్వీకరించండి. అంతేకాదు, నీకు జలచరముల ద్వారా ఏ ఆపదా రాకుండా నా స్వంతకూతుర్నే నీకు కాపలాగా నియమిస్తున్నాను. అంతేకాదు : నీకొక మంత్రం కూడా ఉపదేశిస్తున్నాను!" అంటూ ఓ మంత్రం చెప్పి, నాగకన్యను అక్కడ వుంచి తన దారిన తాను వెళ్ళిపోయాడు రాజు. రోజు రోజుకూ రాజుకూ నాగరాజుకూ స్నేహం కూడా వృద్ధి అవుతోంది.

ఇట్లా వుండగా నాగకన్యను ప్రేమించిన నాగుడొకడు రాగా నాగకన్య వెళ్ళిపోబోయింది. అంతేకాదు అది పోతూ పోతూ అక్కడ రాజుగారు దానికి కాపలాగావుంచిన భటుణ్ని కాటువేసింది కూడా అప్పుడే వచ్చిన రాజుకోపంతో పడి వున్న కర్ర తీసుకుని నాగకన్య నడుంపైన కొట్టాడు.

నాగకన్య నాగలోకానికి పారిపోయింది. పోయింది మెదల కుండా వూరుకున్నదా? లేదు! తన ం్రడి అయిన నాగరాజుతో సేవకుడిపైన చాడీలు చెప్పింది. నీవెందుకిక్కడ నాకు కాపలాగా పో అని నడుం విరగొట్టాడు. ఎందుకు కోట్టావూ అని అడిగితే పోయి నీ బాబుతో చెప్పుకో మన్నాడు. నిన్ను చాలాదూషించాడు నాన్నా! నీవసలు రాజువేకాదన్నాడు ఛీ..ఛీ.. నరులకు మేలు చేయకూడదు' ' అంటూ నాగరాజుకు బాగాకోపం వచ్చేలా చేప్పేసింది.

ఆడవాళ్ళ మాటలను ఏ మగవాళ్ళు నమ్మరు! నాగరాజు బాగా కోపోద్రిక్తుడై వెంటనే సేవకుణ్ణి చంపి రమ్మనమని తన భటులయిన నాలుగు నాగుల్ని పంపించాడు.

నాగులు వెంటనే సేవకుడి భవనానికి వచ్చేశాయి. సేవకుణ్ణి వెతుక్కుంటూ అవి రాజాంత:పురానికి వచ్చాయి. అప్పుడు సేవకు డక్కడ తన భార్యతో మాట్లాడుతున్నాడు.

"నాగకన్యను చూశావా రాణి యివ్వాళ్ళ?"

"లేదు ఇవ్వాళ్ళ కనుపించలేదు ఏం?" అన్నది రాణి

"ఇవ్వాళ ఉద్యానవనంలోనికి నేను వెళ్ళేటప్పటికి నాగకన్య ఒక నాగుడితో సరస సల్లాపాలాడుతున్నది. నాగకన్యకు రక్షకుడిగా నియమించిన మన భటుడు అప్పుడే అక్కడకు వచ్చేటప్పటికి నాగకన్య వాణ్ని కాటువేసి చంపింది. ఆ దృశ్యాన్ని చూచిన నాకు చాలా కోపం వచ్చింది. నాగకన్యను చంపేద్దామనుకాన్నాను. కాని నా ప్రాణమిత్రుడైన నాగరాజు కూతురాయె. అంచేత, మళ్ళీ ఆ విధంగా మనుష్యుల్ని చంపకుండా ఊర్కే ఒకసారి భయపెడదామనే ఉద్దేశ్యంతో అక్కడున్న కర్రపుల్లతో ఇట్టుకొట్టాను. అప్పట్నుంచీ అది కనిపించటం లేదు. బహుశా అది నాగలోకానికి పోయిందేమో. అక్కడ కోపంతో నాగరాజుకు నాపైన ఎన్న అబద్ధాలు చెబుతుందో! మాయిద్దరి మధ్యా వున్న మిత్రత్వాన్ని చెడగొడుతుందేమో..."

ఈ మాటలన్నీ విన్న నాలుగు నాగులూ వెంటనే నాగలోకానికి వెళ్ళిపోయి తాము విన్నదంతా నాగరాజుతో చెప్పారు. నాగరాజు కూతుర్ని అడిగి నిజానిజాలు తెలుసుకున్నాడు. అప్పుడు వెంటనే సేవకుడి వద్దకు వచ్చి తాను చేసినదంతా చెప్పాడు.

"మిత్రమా! నా తొందరపాటుకు నేను చాలా సిగ్గుపడుతున్నాను. నేను చేసిన పనికి క్షమించు" అంటూ క్షమానణ వేడుకున్నాడు. వెళ్ళిపోతూ "మిత్రమా, ఇవ్వాళ నీకొక మంచి మంత్రాన్ని చెబుతాను. ఈ మంత్రం ద్వారా సకల ప్రాణికోటిబాష అంతా నీకు తెలుస్తుంది. అయితే - ఇది నీవు మరొకళ్ళకు చెప్పావంటే - నీ తల పగిలి చచ్చిపోతావు!" అని సేవకుడికి ఒక మంత్రం ఉపదేశించి వెళ్ళిపోయాడు నాగరాజు.

ఆ మహామంత్రాన్ని నేర్చుకున్న తరువాత మహారాజుకు పశుపక్ష్యాదులు మాట్లాడుకునే ప్రతిభాషా అర్థమవుతోంది. ఒక రోజున మహారాణి పుట్టిన దినోత్సవంనాడు రాజు రాణులిద్దరూ కలిసి

విందారగిస్తున్నారు. రాజుగారు రాణిగారి సౌందర్యాన్ని చూస్తూ అశ్రద్ధగా తింటూండగా ఒక చీమ " ఓ మిత్రలారా! రండి! మహారాజుగారు కనులపండుగ చేసుకొంటూ మన కడుపులు నింపుతున్నారు, రండి! తినండి!" అని ఇతర చీమలను పిలిచింది. ఈ పిలుపు విన్న మహారాజు ఫక్కున నవ్వాడు. "ఎందుకు నవ్వుతున్నారూ?" అంది మహారాణి రాజుగారు జవాబీయలేదు. ఇందాకట్నుంచీ తనను తదేకంగా చూస్తున్నాడు కాబట్టి తనలో అందం లోపించబట్టి మహారాజు నవ్వాడు కాబోల్నని రాణి చిన్నబుచ్చుకుంది.

అంతలోనే ఒక ఈగల జత అక్కడకు వచ్చింది.

"అబ్బ! ఎందుకనవసరంగా కాలాన్ని వృధా చేస్తారు? వెళ్ళి ఆడుకుందాం రండి" అన్నది ఆడ ఈగ మొగ ఈగతో.

"ఆగాగు! కొంచెం సేపాగు. మహారాణిని అలంకరించటానికి దాసీలు సుగంధ ద్రవ్యాలను అత్తరు పన్నీరులను తీసుకు రాబోతున్నారు. సుగంధ ద్రవ్యాలను తిని అత్తరు పన్నీరుల్లో జలకమాడుకుందాం!" అన్నది మగ ఈగ

ఈ సంభాషణలు విని రాజు మళ్ళీ నవ్వాడు. రాణికి కోపం వుడుకుబోతుతనాలు అధికమయ్యాయి. "ఏమండి - ఎందుకు నవ్వుతున్నారూ?" అని అడిగింది. రాజుగారు చెప్పకపోతే మళ్ళీ మళ్ళీ అడిగి వత్తిడి పెట్టింది.

"ఏమీలేదు. ఏ జీవి ఏభాష మాట్లాడినా నేనర్థం చేసుకోగలను. ఈగల చీమల సంభాషణ విని నవ్వాను!" అన్నాడు రాజు

"వాటి భాష మీకెలా తెలుసు." ఆశ్చర్యంగా అడిగిందావిడ.!

"నాకు నా స్నేహితుడు నాగరాజు ఒక మహామంత్రాన్ని చెప్పాడు. అప్పట్నుంచీ ఆ మంత్రం ద్వారా ఏ భాషనైనా అర్థం చేసుకోగలుగుతున్నాను!"

" ఆ మంత్రం నాక్కూడా నేర్పరూ?" బ్రతిమాలింది రాణి. చెప్పనంటే చెప్పనన్నాడు రాజు. చెప్పాలంటే చెప్పవలసిందే నన్నది



రాణి. " ఆ మంత్రాన్ని మరొకరికి చెబితే నేను చచ్చిపోతాను!" అన్నాడు రాజు. "అయినా సరే చెప్పాల్సిందే" అన్నది రాణి పట్టుబట్టింది! "సరే మాపటికి చూద్దాం" అన్నాడు.

ఆ రోజు సాయంత్రం దిగులుగా బయటకు బయలు దేరాడు రాజు. ఈ రాత్రికి తనకు చావు మూడిందనే నిశ్చయించుకున్నాడు.

నగరం దాటిన తరువాత రాజుగారి రథానికి అడ్డుగా ఒక మేక దారిలో నిలబడి వుంది. రథాన్ని లాక్కుపోతున్న గుర్రం "ఏయ్ నీకు బుద్ధిలేదూ? రథానికడ్డంగా నిలబడితే చస్తానని కూడా తెలియదా?' ' అన్నది మేక నుద్దేశించి.

"ఫరవాలేదు. మహారాజుగారి కంటే బుద్ధిమంతుణ్ణే!" అన్నది మేక సూటిగా.

"మహారాజు బుద్ధిమంతుడు కాడా? ఎట్లా కాదు?" అనడిగింది గుర్రం.

"పెళ్ళాంమీద అతి ప్రేమతో చెప్పరాని మంత్రాన్ని చెబుతున్నాడీ రాజు. నిజానికి ఆ మహారాణే ఈయనగార్ని ప్రేమించటంలేదు.

మరి ప్రేమించేదయితే భర్త చనిపోతాడని తెలిసీ మంత్రాన్ని చెప్పమంటుందా? ఆమెకు మంత్రరహస్యాన్ని చెప్పి చావబోతున్నాడీ రాజు! మూర్ఖుడనుకోవాలా, బుద్ధిమంతుడను కోవాలా?" అన్నది మేక.

"అయితే మరి మన మహారాజు బ్రతికేదెట్టా?" గుర్రం అడిగింది ఆందోళనగా.

" ఈ పనిచేసి బ్రతకొచ్చును!" అంటూ మేక గుర్రానికి కొన్ని రహస్యాలు చెప్పింది మేక. ఇవన్నీ వింటూనేవున్నాడు రాజు. అతనిలో అప్పుడు చావు కళతప్పింది జీవకళ వచ్చింది. వెంటనే వచ్చాడు యింటికి.

"మహారాణీ! మంత్రాన్ని యిప్పుడెలా నేర్పుతాను. అభ్యంతరం లేదు కాని, మంత్రాన్ని నేర్చుకోబోయే ముందు నీవొక నియమాన్ని పాటించాలే!" అన్నాడు రాజు రాణితో.

"ఏమిటది?" అన్నది రాణి ఉత్సాహంగా

"పది కొరడాదెబ్బలు తినాలి!" అన్నాడు రాజు

"ఓస్! అంతేకదా!" అన్నది రాణి అత్యుత్సాహంగా.

"దెబ్బ తిన్నప్పుడు నోరు మెదపకూడదు. పెదాలు తెరిస్తే నీమంత్రం పోతుంది!" అన్నాడు రాజు.

"అలాగే ! కొరడా దెబ్బలకే ఏడుస్తానేమిటి?" అన్నది రాణి గర్వంగా. రాజు నవ్వుతూ దండనాధికారిని పిలిపించి కొరడాతో రాణిని పది దెబ్బలు కొట్టమన్నాడు.

దండనాధికారి స్వయంగా కొట్టిన మొదటి దెబ్బకే "అమ్మ బాబోయ్!" అన్నది మహారాణి. పాపం! సుకుమారి కదూ!

రెండోదెబ్బ తగిలీ తగలగానే "బాబోయ్ నాకు మంత్రమూ వద్దు తంత్రమూ వద్దు!" అని అరిచింది. మూడో దెబ్బ కొరకు దండనాధికారి కొరడా ఎత్తేటప్పటికి మహారాణి అంత:పురంలోనికి పారిపోయింది! కొరడా నవ్వింది. రాజు నవ్వాడు. గాలి నవ్వింది. గాలిలోని జీవకణాలు నవ్వాయి.

# లౌకిక జ్ఞానం వుండాలి

ఒక రాజుగారికి ఒక గురువు గారున్నారు. ఆగురువు గారు వేదవేదాంగాలు చదివినవాడు. సకల శాస్త్రాల్లోనూ పాండిత్య ప్రకర్ష గలవాడు. వేదాంత చర్చల్లోగాని, అలంకార శాస్త్రాల్లోగాని, ఆయనకు పోటీగా నిలిచే విద్వాంసుడే కరువయ్యాడు. ఆ కాలంలో అంతటిదిట్ట ఆ గురువు గారు. కాని ఒక్క విషయంలో మాత్రం ఆయన వట్టి అమాయకుడు. ఆయనకు లౌకికజ్ఞానం బొత్తిగా లేదు.

గురువుగారి భార్య గురువుగారికంటే తక్కువ పాండిత్యం కలది. కాని, ఎక్కువ తెలివికలది! పాండిత్య ప్రకర్షలేకపోయినా లౌకికజ్ఞానమున్నది బాగా. ఈ దంపతులిద్దరూ ఎంతో అన్యోన్యంగా వుంటారు.

ఒకరోజున రాజుగారు గురువుగారికి ఒక పంచకళ్యాణి గుర్రాన్ని బహూకరించారు. గురువుగారు ఆ గుర్రమెక్కి యింటికి బయలు దేరాడు. దారిలో ప్రజలందరూ గుర్రాన్ని పొగిడారు. దాని



అందచందాలను, చలాకితనాన్నీ చూచి మురిసిపోయిరు. ముఖ్యంగా ఆ గుర్రానికి వున్న జీనూ కళ్ళేలూ బంగారపువి "ఆహాహా! గురువు గారి గుర్రం బంగారు కళ్ళాల్లో బంగారు జీనులో ఎంత అందంగా వుంది? ఎంత చూడముచ్చటగా వుంది?" అంటూ తెగపొగిడేశారు. ఈ పొగడ్తలన్నీ వింటూ గురువుగారు ఉబ్బి తబ్బిబ్బయిపోయారు.

ఇంటికి వచ్చి, భార్యముందు తన గుర్రాన్ని గురించీ తన గుర్రపు బంగారు జీనును గురించీ, కళ్ళాలను గురించీ ప్రజలేవిధంగా అనుకుంటున్నదీ అన్నదానికి మరికాస్త అల్లేసి చిలువలు పలువలుగా తన కవితాచాతుర్యాన్ని ప్రదర్శిస్తూ భార్యముందు మహాఉబ్బిపోయాడు మన పండితుడు.

"ఈ మనిషికి చూడగా గర్వమొచ్చేట్లుగా వుంది. అసలు ఆ ప్రజలందరి దృష్టి ఈయనగారిమీదే పడుంటుంది. దిష్టి తగలవచ్చును. కాబట్టి ఈ ప్రమాదాన్ని తప్పించాలి. అబ్బ! లౌకికజ్ఞానం లేని భర్తలతో ఇదే చావు!" అనుకొంది. ఆమె ఆలోచించీ ఆలోచించీ ఇట్లా అంది.

మీరేమో తెగ మురిసిపోతున్నారు. అందరూ ఆ గుర్రాన్ని పొగిడారు. ఎందుకూ? దాని అందచందాల్ని చూచి! దానికి అందచందాలు ఎక్కణ్నించి వచ్చాయి? అది వేసుకున్న బంగారు జీనునూ కళ్ళాలనూ మీరే తగిలించేసుకుంటే మీరు సుందరాకారు లవుతారు. ప్రజలందరూ మిమ్మల్నే పొగుడుతారు. వెధవ గుర్రాన్నే పొగిడితే నాకే మొరిగిందీ - మిమ్మల్ని పొగిడితే నాకానందం!" అన్నదామె.

"అట్లాగా!" అని ఆ పండితుడు మరునాడు రాజాస్థానానికి వెళ్ళేప్పుడు - గుర్రపు జీను తన వీపుకు కట్టుకున్నాడు. కళ్ళాలను పండిత శాలువను కప్పుకున్నట్టుగా వల్లెవాటు వేసుకున్నాడు. తాను గుర్రంపైన ఎక్కకుండా గుర్రాని నడిపించుకుంటూ బయలుదేరాడు!

పాపం ! వీధిలో ప్రతివారు గురువుగార్ని చూచి నవ్వటమే!

అందరూ హేళనచేయటమే! దారి పొడవునా నవ్వులూ ఎగతాళులూ నూ! "గురువుగారు గుర్రంగా ఎప్పుడు మరాడురోయ్!" అంటూ ఒకటే ఎగతాళి! చివరకు రాజాస్థానంలోకి వెళ్ళేటప్పటికి గౌరవసూచకంగా అందరూ లేచి నిలబడ్డారు గాని, ఫక్కున నవ్వేశారు. ఆస్థాన విదూషక చక్రవర్తి హాస్యోక్తులాడుతూ రెండు కథలు కూడా కల్పించేశాడు. రాజు గారిక్కూడా నవ్వు వచ్చింది. కాని పండితుడు చిన్నబుచ్చుకుంటాడనే ఉద్దేశంతోను, తన గురువుగారనే అభిప్రాయం తోనూ నవ్వును బలవంతంగా మింగేశాడు.

"ఇదేమిటి గురువుగారు?' అంటూ అడిగాడు. అప్పుడు గుడ్ల నీళ్ళతో ఆ పండుతుడు తన భార్య యింతపని చేసిందని చెబుతూ జరిగిందంతా చెప్పాడు. ఆమె తప్పేమీ యిందులో లేదని, ఈయన గారికి గుణపాఠం చెప్పడానికి, లౌకికజ్ఞానం నేర్పటానికి, ఈయనకూ ఈయన గుర్రానికి ఆమె యీవిధంగా చేసిందని వెంటనే గ్రహించేశారు రాజుగారు. ఆమె చేసినపనిని విపులీకరించి " మీ శ్రీమతి గారివద్ద లౌకిక జ్ఞానా న్నార్జించండి గురువుగారూ!' అన్నారు రాజుగారు.



# మోసానికి మోసమే మందు

ఒక అడవిలో రెండు నక్కలున్నాయి. ఆ రెండూ బహుయుక్తిగలవి. జిత్తులు వేయటంలో ముందు ఆ రెంటినీ చెప్పి తరువాత మరో జంతువుని చెప్పాలి. ఆ ప్రాంతాల్లోనే మరి కొన్ని మేకలున్నాయి. ఈ రెండు నక్కలూ ఆ మేకల్ని రోజుకొకటి చొప్పున పొట్టనబెట్టుకుంటూ తెగ బలిశాయి. చివరకా మేకలమందలో ఒక్క మేక మాత్రం మిగిలింది. ఆ మేక బహు తెలివిగది. వెనకా ముందూ ఆలోచించిగానీ ఏ పనీ చేయదు. దాని తెలివి నుపయోగించి అది అనేకసార్లు ఈ నక్కల బారినుండి తప్పించుకొంది! అన్ని మేకలు ఆహుతయినా యీ మేకమాత్రం పట్టుబడకపోతూండడం ఆ నక్కలకు తలలు తీసివేసినట్లయింది. ఈ మేకను తినడం ఎలాగా అని రెండు నక్కలూ కూర్చుని ఆలోచించాయి. చివరకు మోసంతోనే యిక ఆమేకను పట్టేసెయ్యాలను కున్నాయి. ఆ రెండూ కూడబల్కుకున్నాయి.

"నీవు వెళ్ళి ఆ మేకతో స్నేహం చేయి. కొన్ని రోజులు గడచిన తరువాత నేను చచ్చిపోయానని చెప్పి, చూడడానికి రమ్మనమని సానునయంగా మన గుహలోనికి లాక్కురా. మన గుహలో పడిన తరువాత మన కడుపులోకెళ్ళక యింకెక్కడికి వెళుతుందనీ?" అని ఒక నక్క రెండవ నక్కకి బోధించింది. రెండవనక్క అదే సరయిన మార్గమనుకొంది.

నక్క మేకదగ్గర కొచ్చింది. స్నేహం చేయటానికని. ఇదేదో మోసంతో కూడుకున్నపనే. నా జాగ్రత్తలో నేనుండాలి'. అనుకున్నది ముందే మేక. నక్కా మేకా స్నేహంగానే వుంటున్నాయి.

కొన్ని రోజులు జరిగిన తరువాత ఒక రోజున ఏడుస్తూ వచ్చింది నక్క మేక దగ్గరకు. "ఎందుకేడుస్తున్నావ్ మిత్రమా?" అని

పలుకరించింది మేక. "మిత్రుడు మరో నక్క చచ్చిపోయింది గుహలో పడుంది. చూద్దువుగాని రా అయ్యో." అంటూ పగలమారి ఏడ్పులు ఏడ్చింది నక్క. నక్కజిత్తుల్ని గ్రహించేసింది మేక!.

"అయ్యో మిత్రమా! నీ మిత్రుడు పోయింది ఒకటి నామిత్రుడు పోయింది ఒకటీనా? నేనొక్కన్నే రావటం ఏమిటి? నా మిత్రులందర్నీ కూడా తీసుకొస్తాను! కేకేయనా!" అన్నది మేక కన్నీళ్ళతోనే.

"ఎవరా మిత్రులు?" అన్నది నక్క ఆదుర్దాగా.

"ఆ రెండు వేటకుక్కలు ఆ యిద్దరి మిత్రులూ మరో నలుగురు. ఆ నలుగురు మిత్రులూ మరో ఏభైమంది అయాభైమందికి మరో రెండు వేలమంది. మేమందరం కలిసే వస్తాంలే పిలవనా?" అంటూ మేక నక్క మొహంలోకి చూడబోయింది. కాని, నక్క అక్కడుంటేగదూ! అది పారిపోయి రెండవ నక్కకు చెప్పి, రెండు నక్కలూ కలిసి ఈపాటికి అడవినే వదలిపోయాయి.



# ప్రాణం పోతుండగా పండగెందుకు

కాశీ రాజుగారు అల్లారుముద్దుగా ఒక తోటను పెంచుతున్నాడు. ఆ తోటమాలిగా ఒక యువకుణ్ణి నియమించాడు. ఆ యువకుడు కష్టపడి, వళ్ళు దాచుకోకుండా పనిచేసేవాడు. నమ్మకస్తుడు, చెట్లను పెంచటంలో పేరుగడించిన వాడున్నూ.

ఆ తోటలో కొన్ని కోతులున్నాయి. ఆ కోతుల్ని కూడా జాగ్రత్తగా కనిపెడుతున్నాడు యువకుడు. కోతులు కూడా యువకుడు మంచితనాన్ని గుర్తించి అతడు చెప్పినట్లే వింటూండేవి.

ఇట్లా వుండగా ఒకరోజున పండుగ వచ్చింది. అది బ్రహ్మాండమైన పండుగ. నగరంలోని యువకులు, యువతులూ, స్త్రీలూ, పురుషులు, వృద్ధులూ, పిల్లలూ, కలవాళ్ళు, లేనివాళ్లు అందరూ ఆ పండుగను జరుపుకొంటున్నారు. యువకుడైన ఈ తోటమాలిక్కూడా ఆ ఉత్సవాలలో పాల్గొనాలనే కుతూహలం కలిగింది. వెళ్ళాలను కున్నాడు. మరి తోటో? తోట పోషణ ఎట్లా? ఒక్క పూటకు



పోయింది మాత్రం ఏముందిలే అనుకున్నాడు. అనుకుంటూ అతడు వెళ్ళిపోబోతూ "ఓ నా ప్రియమైన కోతుల్లారా! నేనొచ్చేవరకూ తోటను కనిపెట్టుకొని జాగ్రత్తగా వుండండి!" అని వెళ్ళిపోయాడు.

సాయంత్రమయింది. ఆ సమయంలో తోటమాలి రోజూ చెట్లకు నీళ్ళు పోస్తూండేవాడు. అప్పుడు కోతుల నాయకుడు తన అనుచరులతో ఇట్లా అన్నాడు.

"యువకుడైన తోటమాలి ఉత్సవాలకు వెళ్ళాడు. ఈ పూల తోటకు నీరుపోయకపోతే రాజుగారు ఆ యువకుణ్ణి పనులనుండి తీసివేయవచ్చును. యువకుడు పోతూ పోతూ మనలను కనిపెట్టుకు నుండమని చెప్పి వెళ్ళాడు. అతడు మనల్నెంతో ప్రేమతో చూచు కుంటున్నాడు. మనకు స్నేహితుడు. మన స్నేహితుడికి రాజుగారిచేత మాట రానిస్తామా? మనమే తోటలోని చెట్లకు నీళ్ళు పోద్దాం ఏమంటారు?"

కోతులన్నీ అందుకంగీకరించాయి. చెట్లకు నీళ్ళుపోయ బోయాయి. అప్పుడు కోతులనాయకుడు మళ్ళీ ఇట్లా అన్నాడు.

" మళ్ళీ ఒకసారి చెబుతున్నాను జ్ఞాపకముంచుకోండి. మన మిత్రుడైన ఆ యువకుడికి రాజుగారిచేత మాట రానీయకూడదు! మొక్కను పీకండి. వేళ్ళు ఎట్లా వున్నాయో పరిశీలించండి. పొడవుగా వేళ్ళుంటే ఎక్కువ నీళ్ళు పోయండి. పొట్టిగా వేళ్ళుంటే తక్కువ నీళ్ళు పోయండి. తెలిసిందా? మన మిత్రుడికి మాట రానీయకూడదు!"

అట్లాగేనని కోతులన్నీ మొక్కలన్నింటినీ పీకి పారేశాయి.

మర్నాడు రాజు చూచి కోపంతో భటులచేత కోతుల్ని కొట్టించి తరిమించాడు. తోటమాలిని శిక్షించి పనిలో నుంచి తీసేశాడు.

.. .... ..